# ఆంధ్ర సర్వస్వము.



( [illegible] )

రాజమహేంద్రవరము

సంపుటము ౧    సంచిక ౩

# అనురాగోదయము

[వఝ్ఝుల వేంకటేశ్వరకవిగారు]

ఆటలాడుచుఁ బాటపాడుచు
నేటినంతన మెప్పుఁగా నల
నీటిపై నిక బోటుమీఁదుగ
మాటలాడుచుఁ బోదమా!

—చెలి!

కౌఁగిలింతల నంత యేనను
భోగభాగ్యము గల్గఁగాఁగను
సాగుచుండఁగఁ జల్లగాలికి
వేగహాయిగఁ బోదమా!

—చెలి!

చేయిభుజమున వేసి పట్టుగఁ
బోయి మెల్లన వీచు చల్లని
వాయువుల్ సుఖమొసఁగ మేనికి
హాయిగా విహరింతమా!

—చెలి!

నెమ్మి మీరఁగఁ బూలవాసన
గుమ్మురింపఁగఁ జల్లగాలికి
సమ్మదమ్మున మేలుపూలవ
నమ్మునన్విహరింతమా!

—చెలి!

మేడలోపల సంతసంబుల
వాడలోపలఁ; గోయిలల్ రహిఁ
బాడుచుండెను పూలతోటల
వేడుక న్విహరింతమా!

—చెలి!

నెమ్మొగంబున మోముఁ జేర్చుచు
సమ్మదంబు దలిర్పఁగా, సౌ
ఖ్యమ్ము మీరఁగ ముద్దులాడుచు
నెమ్మిమై విహరింతమా!

—చెలి!

ఇద్దరము ప్రేమమ్ము మీరఁగ
హద్దులేని ముదంబు దోఁపఁగ
ముద్దులాడుచుఁ బూలతోటల
నద్దిరా! విహరింతమా!

—చెలి!

జాలమేల యొనర్పఁజాలెదు?
వాలుఁజూపుల తాలు వెలయఁగ
లీల మోహము మీరవింతలఁ
బూలతోటలఁ గందమా!

—చెలి!



# ఆంధ్ర విశ్వవిద్యాలయము



ఆంగ్లేయులచేత ఆంధ్రులన్యభాషా ప్రజలలో కలుపఁబడి పరిపాలింపఁబడుటచే ఆంధ్రవ్యక్తిత్వము పూర్తిగ మారుగుపడి పోయినది. అందుచేతనే భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణముకొఱకు ఆంధ్రోద్యమము ప్రారంభింపఁబడినది. భాషాప్రయుక్తముగ దేశపాలనము నెలకొల్పఁబడినఁగాని ఆంధ్రులు స్వతస్స్థితిని పొందజాలరని 1913సం॥ రాన దేశభక్తులు దేశోద్ధారకులు ప్రథమాంధ్ర మహాజనసభను సమావేశముచేసిరి. అదే ఆంధ్రోద్యమమునకు ప్రారంభము. రాష్ట్రీయసభలను సమావేశము చేయుటకు తొలి దారిని మొదలిడినది ఆంధ్రులే.

ఆంధ్రోద్యమముయొక్క ముఖ్యోద్దేశములు రెండు, అవి ప్రత్యేకవిశ్వవిద్యాలయమును ప్రత్యేకరాష్ట్రమును స్థాపించుట. అందు విశ్వవిద్యాలయ సమస్య దొరతనమువారంగీకరించి నాలుగైదుసంవత్సరము లయినను దానిఫలమనుభవించు భాగ్యము మనకు నేటికి కలిగినది. ది 28—4—1926 సం॥ రం నుండి విశ్వవిద్యాలయ కార్యక్రమము ప్రారంభము కానున్నది. ఈ ఆలస్యమునకు కారణము ధనలోపమును స్థలనిర్ణయమును కూర్చిన తకరారును.

ఆంధ్రదేశమధ్యముననున్న విజయవాడ కేంద్రస్థానముగ చేయఁబడు టెంతయు సమంజసము. కాని సాంకేతికవిద్యాలయము ఆంధ్రదేశమున కంతకును ఒక విశాఖపట్టణమున నేర్పాటు ధర్మముకాదు. దత్తమండలవాసులకనుకూల మగుటకై విజయవాడయందు గాని అనంతపురమున గాని వేరొకస్థానమున సాంకేతికవిద్యలు నేర్పుట యగు. అటులయిన ఉత్తరాంధ్రులకు రాజమహేంద్రవర విశాఖపట్టణములును తక్కినవారికి అనంతపురము విజయవాడలును సరిసమానముగా నుండగలవు.

ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు మొదట వైస్చాన్సలరుగా నియమింపఁబడిరి. వీరీపదవికెంతయు నర్హులు. భాషాప్రయుక్తరాష్ట్రనిర్మాణమునకు ప్రయత్నించినవారిలో వీరొకరు. ఆంధ్రోద్యమమునందు వీరికభిమానము మెండు. ఆంధ్రవిశ్వవిద్యాలయ స్థాపనసంఘమునందు వీరు సభ్యులుగ నుండిరి. అందు ప్రణాళికయు వీరే వ్రాసిరి. ఆంధ్రమున మంచి ప్రవేశము కలదు వీరికి. వీరు మంచివిమర్శకులు అందుకు వీరకవిత్వతత్త్వవిచారమే సాక్షి.

ఆంధ్రులందరును ఏ పక్షమునకు చేరినను ఏకగ్రీవముగ మాకు ప్రత్యేక విశ్వవిద్యాలయము కావలెననియే ఘోషించిరి. కావున రెడ్డిగారీపదవి నంగీకరించుటలో తప్పేమియు లేదు. వీరీపదవి కర్హులే కాని

తల్లి లంజయైనఁ దాసేమి యగునొకో
యింత యరయ వైతి వేమికుక్షి

౦. తిట్టితి వని కినియను జు
ట్టొట్టు లయిన నన్నుఁ గొలుచుటే య
భిమత మాఁ
బట్టే నను సేవించెను
పట్టున నీపట్టుదలకుఁ బ్రమదముఁ గంటిన్

క. నీ కార్యదీక్ష నీనగు
లోకజ్ఞత నీదుసత్యలోలత నీ వి
ద్యాకాంక్ష నీదుసేవయు
నాకున్ మదికెక్కె దీవనల నీకిడుదున్

మ. కలలోనైన భవద్విపక్ష జన
తా కావ్యమ్ములం దోఁచు త
ప్పులనే చూపుటయున్ మహాసభ
లలోఁ బూర్వాంధ్ర మీనాఁటి వా
రలకున్ రాదని చెప్పి దెప్పుట
యు దుర్వారంబుగా సారె నీ
కలవాటైనది మానుకోఁగలవె
వత్సా మత్సరాలాపముల్

క. పామరజనసౌలభ్యము
నీమనమునఁ గోరి నన్ను నిఖిలజనసుబో
ధామృతమునఁ దేల్చెదనని
యీమతముం గొంటి నీదుహృదయ
మెఱుఁగుదున్

ఆ. పట్టుదొరమతంబు హిత మగునే నీకు
నాదికవులమతమె యహితమగునె
యొకటి సేయఁ బోయి యొకటి సేసె
దు నన్నుఁ
గోడు బాపఁ జేయకుము కుమార

క. భల్లుకపుఁబట్టు నీకే
చెల్లున్ నాసేవ నీవు చేసినటులు వి
న్నెల్లనివారలు సేయరు
చెల్లరె యరులైన మెచ్చఁజెల్లదె నిన్నున్

సీ. ఆంధ్రభాషాదేవి నగునాకు నద్దమై
మించు భారతము గాలించి చూచి
నన్నయ్య గాదియౌ నాఁటి నాఁక సమస్త
కవులు వాడిన ప్రయోగము లెఱింగి
లాక్షణికులు సెప్పలేకుండు బోకు స
త్కవులపోకడకు న్యాయముఁ దెలిసి
సకలభాషాతత్వశాస్త్రజ్ఞీ సంపదన్
నాపుట్టుపూర్వంపు రూపులరసి

తే. నాదుపూర్వరూప మెఱుంగ గాదటంచుఁ
జెప్పఁ బగిఁ బూనియైన నీచేయుసేవ
నాదుమేల్గోరి కొల్చుచున్నా మటంచు
జెప్పికొనునీవిపక్షులుం జేయ లేరు

ఆ. పరమభక్తినైనఁ బగనైన వగనైన
బ్రీతినైనఁ బ్రాణ భీతినైన
నాదుసేవ సేయువరుఁ బ్రోతు నీకు న
ట్లగుట నేఁ బ్రసన్ననైతిఁ దనయ

సీ. ప్రతివాదఖండనప్రతిభటాగ్రహబుద్ధిఁ
గలఁగి పేరెలుఁగు గద్గదికపడఁగ
గ్రామ్యంబుపై మదింగలకృపారసమునాఁ
గనుదోయి బాష్పాంబుకణములురల
వాదసంగతపారవశ్యరసావేశ
కలనమైఁ గాయంబు కంపమొంద
నతిదీర్ఘ మగునుపన్యాస మొనరింపఁగ

# శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యుల వారి జీవితము

[నిడుదవోలు వేంకటరావుగారు బి. యే.]

శబ్దరత్నాకరమును నాంధ్రనిఘంటువును రచించి, యాంధ్రభాషకు మఱువరాని మహోపకారముఁ గావించి, యశఃకాయులైన శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులుగారి నామమును వినని వారాంధ్రులలో నరుదు. ఆంధ్రవాణిని, నాఁ బరఁగిన చిన్నయసూరి వెనుక దాక్షిణాత్య పండితులలోఁ జిరస్మరణీయుఁడగు నీపండితుని చరిత్ర మింతదనుక నెవ్వరునుఁ దెల్పినట్లు కానరాదు. ముప్పది నలువదియేండ్ల క్రిందట గతించిన మనకాలపుఁ బండితుల చరిత్రములే మనకు తెలియకయుండ నెన్నియోవందల యేండ్లక్రింద జీవించియున్న పండితకవుల చరిత్రములు మనకు గగనారవిందము లగుచున్నవని చెప్పుటలో నాశ్చర్య మేమిగలదు? కావున నాకుఁ దెలిసినంతవరకు నీచరిత్రమును వ్రాసి ప్రకటించుచున్నాఁడను. విజ్ఞులు క్షమించెదరుగావుత!

సీతారామాచార్యులుగారు నాగపట్టణమున క్రీ. శ. 1827 సంవత్సరమున జన్మించిరి. వీరు ద్రవిడదేశ వైష్ణవులు. వీరు జననమాదిగ నాగపట్టణముననే నివసించుచుఁ బండితోత్తముఁడగు తమతండ్రిగారికడ విద్యాభ్యాసముఁ గావించిరి. అంతఁ గొంతకాలమునకు బాల్యావస్థ వీడి వయఃకాలము ప్రారంభ మైనతరువాత యథోచితముగఁ గవితాధార యొకింత గలుగఁ దమ స్వస్థలమున నస్వస్థాభిధానుఁడై యొసఁగుచున్న శ్రీసౌందర్యరాజస్వామిని నుతింపఁ దలంపుఁగొని యేతన్నామాంకితంబుగ నొక కందపద్య శతకము రచించిరి. ఈశతకము శతకకవి చరిత్రకారులకుఁ జిక్కుటచే దానియందుండి యాచార్యులవారి ప్రథమకవనశైలినిఁ దెల్పుటకై *మూఁడు పద్యము లుదహరించుచున్నాఁడను.

"క. హరశూల నామశరదా
శరదాసితగాత్ర భక్తజనహితవరదా!
వరదా మరుచిర సురదా
సురదాన్య మహిత సురాజ సుందర
రాజా! 88

క. అగణితచరిత! గదాగ్రజ!
జగదీశ! జగన్నివాస! శాంతాకారా!
ఖగరాజ ఘనస్యందన!
నగధర! హరితేజ! నాగనగరీరాజా! 80

---

* శతకకవుల చరిత్రము. నూతనముగఁ బ్రకటితము. 378 పుట.

క. మలయజ శిశిరతము రుచిర
జలరుహావళీ సమృశనయున జలనిధి
శయనా!
కలరవకలిత కటకయుగ
సులలిత మృదుపదపయోజ సుందర
రాజా!" 67
(క్రీ. శ. 1849)

ఈ శతకము "అంబర శైలశిఖరి ధరాములు" లో రచియింపఁబడిన దగుటచే నప్పటి కాచార్యులవారి వయస్సు పదిరెండేండ్లు. అంత తామింతకు మున్ను సంపాదించిన జ్ఞానముతోఁ దృప్తి నొందక యింకను విద్యావిచారణ సేయుం దలంచి, తిరుమయూరి కనతిదూరమున నున్న చెన్నపురికిఁ బోయిరి. ఆ కాలమునఁ జెన్నపురిలో నేఁడున్నట్టి సుప్రసిద్ధ కళాశాలలు లేవు. చెన్నపురి విశ్వవిద్యాలయ మప్పటికి స్థాపింపఁబడలేదు. నేఁడు రాజధాని కళాశాల(presidency College) గాఁబరఁగుచున్న కళాశాలయందప్పుడే ప్రథమశాస్త్ర పరీక్ష (Intermediate) పట్టపరీక్ష (బి. ఎ) తరగతు లేర్పరిచిరి. తక్కిన కళాశాలలన్నియు నప్పుడున్నతపాఠశాలలుగా నుండెడివి.

కాని యాచార్యులవారికిఁ గావలసిన దాంగ్లేయవిద్య కాకుండుటచే, నాకాలమున సుప్రసిద్ధవిద్వాంసుఁడై, రాజధానీకళాశాలయందు ప్రథమ పండితపదవి నలంకరించియున్న పరవస్తు చిన్నయసూరిగారికడ కేగి, వారివద్ద విద్యావిచారణ సేయుట కారంభించిరి. సూరిగారి సమాశ్రయము గలిగినతోడనే, రాజధానీకళాశాలయందే ద్వితీయాంధ్రపండితులును, నాంధ్రమహాభాగవతమును మొట్టమొదట ముద్రించినవారును నగు శ్రీపురాణము హయగ్రీవ శాస్త్రులవారితోడను, సూరిగారి రెండవకొమరుని మామగారును, సూరిగారి వెనుక నీతత్పండితపదవి నలంకరించిన శ్రీశేకము రామానుజసూరిగారితోడను కూడ నాచార్యులవారికి పరిచయము గలిగెను.

ఇట్లు నిరంతరము పండిత పరిచయముచే నాచార్యులవా రనేకవిషయములు గ్రహించుటకేగాక, నేగ్రంథముచేత నాచార్యులవారి నామధేయము నేఁడు రేపు, ముందుఁగూడ నిలువఁగలదో, యేగ్రంథముచేత నాచార్యులవారి పేరు తొలుతఁ బైకి వ్రాకినదో, యట్టి శబ్దరత్నాకర నిఘంటురచనమున కీకాలమే బీజభూతమయ్యెనని చెప్పనొప్పును. అప్పుడే చిన్నయసూరిగారు తెలుఁగు నిఘంటువు నొకదానిని రచియింపం దలంపుగొని మొదటి రెండుసంపుటములుఁ బూర్తి గావించిరి. కాని మూఁడవసంపుటము ప్రారంభించిన యలఁతి కాలములోననగా క్రీ. శ. 1862 లో దుందుభి సంవత్సరారంభమున సూరిగారు పరమపదించిరి. తాము చనిపోవునపుడా యసంపూర్ణ నిఘంటువును రామానుజసూరిగారికి బూర్తి సేయుటకిచ్చిరఁట! కాని వారుం దానిని

బూరింపలేదు. సీతారామాచార్యులవారి కా యసంపూర్ణగ్రంథముఁ బూర్తిసేయుట కంటె తెన్నూదిపదయుతంబును, ప్రయోగసహితంబును, పఠశాలోపయోగ్యంబును నగు నొకనిఘంటువు రచించిన బాగుగ నుండునని యూహించి, తమకు స్థిరమగు జీవనోపాధి గలుగగనే యానిఘంటు ప్రారంభమునకుఁ గడఁగినట్లు తోచుచున్నది. కావున నీకాలమే యాచార్యులవారి నిఘంటు నిర్మాణోద్యమమునకుఁ బునాది యని చెప్పనొప్పును.

రామానుజసూరిగారు మదరాసునందు క్రీ. శ. 1855 లో బోధనాభ్యసన పాఠశాల (Normal School) స్థాపించినదాదిగనందు నాంధ్రవిద్యోపాధ్యాయులుగా నుండెడివారు. వారచ్చటఁ బండితులుగనుండుకాలముననే క్రీ. శ. 1859లో నప్పకవీయముఁ బ్రప్రథమమున నచ్చువేయించిరి. వారు తొమ్మిదిసంవత్సరములు పనిచేసిన వెనుక, పాఠశాలయందు విద్యార్థులసంఖ్య హెచ్చగుటంజేసి మఱియొక పండితుఁడు కావలసివచ్చెను. అంత నింతకుమున్నె చిరపరిచితులగు సీతారామాచార్యులవారినిఁ బ్రేరేపింప వారునుఁ బ్రయత్నించి తమ యిరువదియేడవసంవత్సరమున (క్రీ. శ. 1864 నవంబరు తే 21 దిని) నాస్థానమున నియుక్తులైరి.

సీతారామాచార్యులుగారు ప్రవేశించిన మఱికొంతకాలముననే యనఁగా 1865 సంవత్సరము జనవరినెలయందు రామానుజసూరిగారు రాజధాని కళాశాల (Presidency College)కుఁ బ్రథమాంధ్రపండితులుగా మార్చఁబడిరి. వారు వెళ్లిన మఱి యొకసంవత్సరమునకే 1866 సం॥ నవంబరు తే 16 దిని సీతారామాచార్యులవారు పాఠశాలయందుఁ బ్రథమపండితులై తమ జీవితకాలమంతయు నందే గడపిరి. రాజధాని కళాశాలయందు రామానుజసూరిగారు 1878సంవత్సరమువఱకుఁ బండితులైయుండి కీర్తిశేషులైరి. వారి యనంతరము, చదలువాడ సీతారామశాస్త్రిగారు, ప్రథమపండితులుగను, బ్రహ్మశ్రీ కొండా వేంకటరత్నము పంతులుగారు ద్వితీయపండితులుగను నియమింపఁబడిరి.

సీతారామాచార్యులువారు నిఘంటువును క్రీ. శ. 1862 సంవత్సరముననే ప్రారంభించి, మఱి యిరువదియైదుసంవత్సరముల కాలమునకు ననఁగా క్రీ. శ. 1887 సంవత్సరమున ముగించిరి. నిఘంటురచనమునకుఁ దగిన గ్రంథసామగ్రి యెల్ల సమకూర్చినదియు, నెల్లుగలిగిన గ్రంథములనెల్ల విమర్శించి పదములఁ జేర్చినదియు, నెల్లవి, పో. రామానుజులనాయఁడుగారును, కొమాండూరు అనంతాచార్యులుగారును వ్రాసినదియు, గ్రంథరచనమునం దెట్టిప్రయాసమునకు లోనైనదియు శబ్దరత్నాకర పీఠికయందుఁ దత్కర్తలే స్పష్టముగ వ్రాసియుండుటచేఁ జర్వితచర్వణ

ముగ నానినిట వ్రాయలేను. కాని యీ శ్లోకమహాసీయుడు, దేశమునకుఁ గాని, భాషకుఁగాని, సంఘమునకుగాని, మఱువరాని మహోపకారము గావించినప్పుడు, వారుపడిన వ్యయప్రయాసములుకూడ యువకుల మనస్సంతోషముగ నొనరించును.

ఏదియైన మహోద్యమమును దలపెట్టి దానిసిద్ధికై పాటుపడు నప్పుడట్టి ప్రయాసములు, తప్పి క్లేశసాధకుల, మనస్థైర్యమును, పట్టుదలయు నొరులకుఁ దెలుపఁజాలును. పైని చెప్పినరీతి నాలోచించిన సీతారామాచార్యులవారొక, మహోద్యమమును దలపెట్టి, దాని సంపూర్ణముగ ఫలవంతముగ నొనర్చిన మహానీయులని చెప్పనొప్పును.

సీతారామాచార్యులవారి ప్రయాసమున నీనిఘంటువుపుటఁ బూర్తిగావింప దానిని చెన్నపురిదేశభాషాగ్రంథకరణసభ (Madras Schoolbook and Vernacular-Society) వారు క్రమముగఁ బరీక్షించి, గ్రంథకర్తలగు నాచార్యులవారి శ్రమకు మెచ్చి వారికై దువేలరూపాయలు నన్మానముగా నొసంగి యీశబ్దార్థ స్వాతంత్ర్యమును (Copyright) వారుదీసికొనిరి. తగిన వారిని తగినట్లు సత్కరించి గౌరవించుట సభాలక్షణమేగదా!

(సశేషము)

# ధైర్యశాలియైన నావికుడు

[కాళహారి వెంకటరామారావుగారు]

అన్నిదిశలను నలముకొని మ
ధ్యాహ్నభానుని తీక్ష్ణతాపము
ఎన్నమున్నహిమామందరోచిఁ బ్ర
జ్యోత్స్నతికి నెల్లన్

ఆమహాసరసున జలంబుల
గోముమీఱంగఁ దేలిపడచెడు
సేమమున నొకనావదా భయ
మేమియును లేకన్

ఎందఱో యాత్రస్థులత్యా
నందమున కన్గొనిరి జలచర
బృందసంకులమగుచు నయనా
నందమిడు సరసిన్

అల్లనల్లన నాయకున్ గని
మెల్లగా నొకఁ డోకహాస్యముఁ
జెల్లమోరుచ నతనిముఖమును
తెల్లబడిపోగాన్

మోటనిలువక నావయంతట
నోటనోటను బ్రాకిపోయెను
మేటిభీతిని యాత్రికులయు బ
లాట మేమందున్?

"నిలువనిక మాకాన లేదా?
కలమెమాబంధులను జేఱఁగ?"
పలుభయంబున నందఱనుచు
నిలిచి రొక్కమొగిన్

ఘనతరాగ్ని జ్వాలలపుడే
మొనసినావను గాల్చుచుండెను
ఘనవిషాదముతోడ నాయకుఁ
డనియె నీకరణిన్

ఒక్కయాసయె మిగిలె నింకను
అక్కరలో మననావఁదూరుపు
దిక్కునన్ దీరమును జేర్చిన
చక్కనౌ ననియెన్

అతరిన్ గలఁగూపదకు ని
శ్చితుఁడై "నావికుఁడు" ధైర్యస
మేతుఁడై చుక్కానిదరి నం
ప్రీతుఁడై నిలిచెన్

"తూరుపుందెస క" నుచుమంటల
హోరుపై నాయకుని గంభీ
రారవము వినవచ్చుచుండెను
దారుణంబగుచున్

"తూరుపున కే నావఁబట్టుము
తీరభూమి సమీపమాయెను
జేరఁగలము పరాత్పరుని దగు
భూరికృపవలనన్

వెడిదమై భయదంబులౌచును
కడగి జ్వాలలుదరిని; నావికు
డెడపకన్ జుక్కానిపట్టును
విడువఁడించుకయున్

"నిలుముతండ్రీ యిటులె దరియుం
గలము నాలుగునిముసములలో
నిలిచిపోవుము" యనెనునాయకుఁ
డలుఁగుశాల్పడఁగన్

మింటనంటెడు మంటలన్ కన్
గంటుపరచెడి ధూమమున నా
బంటుమానిసి నిలిచిపలికెను
ఘంటికాధ్వనితోన్

"దైవనాయాజ్ఞమున నేనిటు
లోవకిచటనెనిల్తున" నుచును
చావుదేవతతోముఖాముఖ
నావికుఁడు పోరెన్

ప్రాణముల్పై నాసవిడిచి య
మానుష ప్రజ్ఞాధురంధరుఁ
డైననానావికుఁడొప్పె నిశ్చలుఁ
డైన మునియటులన్

ఉరవడిని శిఖరిసియూతని
యురము, ముఖములనంటె బ్రాగ్గుల
కరణి నొకపా స్తమునుగాల్చెను
వెరచినాఁడేమో?

వెరపులేకను పండ్లుబిగియఁగఁ
గొఱుకుచున్ దినబాధపడచుచు
మరలనావను నడిపినదె సు
స్థిరత రహియింపన్

"నిముష మోర్చుము; నిలుము నీదగు
శ్రమతుదిన్ గనుధైర్యమూర్తి!"
నిముషమునసే నావయును తీ
రమున కేతెంచెన్

మించు ధైర్యస్ఫూర్తినటుర
క్షించు నావికుఁ డిప్పుడెక్కడ?
ఎంచవచటనె కూలబడి య
ర్పించెఁ బ్రాణములన్

పట్టువిడువని యతిపికరములు
పట్టాఁదప్పఁగ, వివశుఁడై యీగా
పట్టునను బడె; నాయువ్వు దన
పట్టువిడి చనియెన్

పొంగిపొరలుచు నతనిదేహము
క్రుంగిపొంగు తరంగసంఘము
భంగురంబగు నతనియశము
రంగఁ గీర్తించున్

సంతసముతోఁ బ్రాణములఁగా
సంతసేయకనిచ్చెఁ బరహిత
స్వాంతుదివ్యాత్మకునునిత్య
శాంతి నొప్పారున్

తూర్పుఁ జెన్నుఁడు నట్టి ప్రాజ్య
స్ఫారయశదంబైన చితిపై
జేరి దేహముఁ జేర్చగాఁ గన
నేరఁడీ పరికిన్



# క్రొత్త తెనుఁగు—ప్రాఁత తెనుఁగు

[ఒక భాషాభిమాని]

(గతసంచి కానుబంధము)

మఱియొకటి మ॥ సెట్టి లక్ష్మీనరసింహముగారు కోరిన పదిరూపములును గ్రంథములయందు వాడుటకు మీవంటి భాషాభిమానులయిన పండితులందఱంగీకరించెదరనుకొందము. అంతటితో భాష పరిపూర్ణత పొందిపోవునా? వీరి కోరికలన్నియు నెఱవేఱిపోవునా? భాషయంతయు నీపదిరూపములు వాడుటవలననే సులభమయిపోయి బాలురకెల్లరకును గరతలామలకముగా నుండి వారినందఱను బండితాగ్రగణ్యులుగా నొనర్చునా? అయ్యలార! పాఠశాలలయందు బాలురు హిస్టరీ, జాగ్రఫీ, ఇంగ్లీషు, లెక్కలు, ఆల్జిబ్రా, జామెట్రి మొదలయిన లెక్కలేని శాస్త్రములను నేర్చుకొనుటకు సమర్థులయియుండి మాతృభాష విషయమయి యొక్కింత శ్రమ దీసికొని పదిరూపములను వ్యాకరణయుక్తముగా నేర్చుకొనలేరనియు వారికదియే బ్రహ్మాండముగానున్నదనియు వారికష్టము నివారింప మనమందఱము తోడుపడవలయు ననుటకంటె వేఱొకవింతయైన యంశమున్నదా! గొప్ప ధనవంతుఁడయి యాలివంక వారినందఱను బోషింపుమఁ దన్నుఁ గన్న తల్లికి బట్టెఁడన్నమిడుట కిష్టము లేక రుసరుసలాడుకొనుచు నామె నిలు వెళ్లగొట్టు పరమపుణ్యాత్మునివలె నీరలన్యభాషలయం దత్యంతాదరము జూపి

ణయను సర్గములో వాఁడు సాహసి యెవ
డుఁగలఁడు. అట్లు వాడఁగూడ దని వానికెవ
రు బోధించిరి. స్వాభావికముగానే భాష
లోని మార్పులు గొన్ని యెవరిప్రయత్న
మక్కఱలేనిదే గ్రంథస్థము లగుచున్నవి.
అట్టి గ్రంథస్థము లయిన మార్పులను
మీరు తప్పులుగా నెన్నక యొప్పులుచేసిన
చాలును. అప్పకవి కనులు, చనులు, చె
వులు, కాళ్ళు మొదలయిన శబ్దములు త
ప్పని వానిని భాషయందువాడకుండ నిషే
ధించియున్నాఁడు. అయిన భాగవతములో
బమ్మెర పోతనామాత్యుఁడు, 'భూషణము
లు సెవులకు బుధతోషణము' లనియు,

"సీ. మకరితోడఁ బోరు మాతంగవిభుని నొ
క్కరునిడించి పోవఁ గాళ్ళు రాక"

అనియు నితరగ్రంథములయందుఁ
గనులు చనులని వేనవేలుగాను గవులు
వాడుచున్నారు. ఇంతయేల మనమందఱ
మాంధ్రభాషకుఁ బ్రమాణగ్రంథముగా
గ్రహించిన భారతమునందే యుద్ధపర్వము
అందు తిక్కనగాళ్ళని ప్రయోగించినాఁడు.
మఱియొకమాట చొరకక వ్రాసిరా? కా
దుకాదు వారినట్టి ప్రయోగములు సేయు
మని యెవరైన నిర్బంధించిరా? లేకున్న
వారేల చేసిరి? భాష మాఱుటవలన నా
శబ్దములు మిక్కిలి తఱుచుగా వాడుకలో
నికి వచ్చుటవలన నమ్మహాకవుల కది తప్ప
ను జ్ఞానములేక, కూడదను సంశయమును
గూడ దోఁపక స్వాభావికముగా తనంతట
తాను ప్రోత్సహించివచ్చిన పదము గాన నా
పదము వారి వశములేక గ్రంథములోనికి
వచ్చెను. అట్లు గ్రంథస్థమైన పదము లనే
కములు మన భాషయం దున్నవి. వానిని
ల్ల తప్పని వ్యాకరణవేత్తలు దూషించిన
నవి మానక కవు లనేకులు ప్రయోగించు
చునేయున్నారు. వారి నట్లు ప్రయోగింప
కుండ నెవ్వరైనను అడ్డగలిగిరా? మీరు
కూడ నట్టి ప్రయోగములను వాడిన వడ్డు
వారెవరు? మీరు 'తమూరురోజు' మొదల
యిన ప్రయోగములు వాడలేదా? వాని
కేమని యాక్షేపణవచ్చినదా? తీరికూరు మం
డి యేమియు తోఁచక నుబుసుపోని మం
గలి పిల్లిబుఱ్ఱగొఱిగె ననునట్లు మీరిట్టి
వితండవాద మొకటి గూర్చుకొని మా
తృభాషపైకి దండెత్తివచ్చుచున్నారు గాని
వేఱొండుగాదు. అట్లు సేయక, మొదటి
నుండియు మన గ్రంథరాజంబులలో నుత్త
మములని యెన్నఁబడిన గ్రంథంబులయం
దుఁ గవులచే వాడఁబడిన వ్యాకరణ వి
రుద్ధ ప్రయోగము లన్నియు నేర్చి యొక
చోట వానినిఁ జేర్చి యయ్యవియెల్లనానా
కాలముల యందలి భాషారూపముల న
నుసరించి వాడబడెనని నిరూపించి యిది
వఱకు నవి తప్పులుగా నెన్నఁబడుచున్నప్ప
టికి నిప్పుడు వాడుకొను రూపములుగనుక
వానినన్నింటి నొప్పులుగా బరిగణింపుఁడని
కోరిన మీవాదము సహేతుకముగానుండి

# కలకత్తాయందొక నాటి వెన్నెల రాత్రి

[పెమ్మరాజు రాజగోపాలముగారు]

మ. అదిగో చారువసంతకాల శశి సి ♦ ల్లాకాశమందుండి, శ
స్నిగ్ధమై, చల్లనిదై, సుధాకవశమై ♦ రాత్రుల్లు చంద్రాతపం
బెవ కాహ్లాదముగాగ నిచ్చుచును దా ♦ నీనాడు, రేరాజ స
త్పదసన్మానము గన్న సార్థకము యా ♦ వచ్ఛక్తి జూపించెడిన్

ఉ. సందడిలేదు వీధులను ♦ సౌమ్యసుధాకరసాంద్ర చంద్రికా
బిందువులెల్ల గ్రోలుకొని ♦ పెల్లగు మైకముచేత సౌధముల్
క్రిందుగ నిల్చియున్నయవి ♦ కన్పడు చల్లవె బారుబాగుపై
మందిరదీపిక ల్వెలుగు ♦ మ్లానముగా నవి సృష్టి గెల్చునె?

ఉ. చల్లనిమంచులోన, విర ♦ జాజి బజారులలోన, వేలుపుల్
వెల్లువలోన, గ్రొమ్మెఱుగు ♦ నిగ్గు పరంపర సోనలోన, పై
జల్లెడు వెండినేతపని ♦ చాపులలోనను నిల్చినట్టు లీ
తెల్లని పండువెన్నెలల ♦ తెప్పలపై నిట తేల, నుండెడిన్

చ. ధనిక గవాక్షమార్గముల ♦ దట్టుచు దొంగవిధంబ నిద్రలో
మునిగిన నాయకీజనము ♦ ముంగురులం గదలించి, కామియై
చనుచను మెల్లమెల్లగను ♦ జారునిపోలిక నర్థరాత్రి నే
రును గనకుండ వీధులను ♦ లోలత వీచెడి మారుతుండిదే

ఉ. బారుమటన్న దీనగరి ♦ భాసిలుచున్న శశాంకుకాంతి, నె
వ్వారు జరింపమిన్వికృత ♦ భావము నొందిన మానముద్ర చే
కూరుకు చెందె నాపయిన ♦ గొబ్బున విద్యుతిదీప దయ్యముల్
గేరెడదే వికారముగు ♦ కృత్రిమహానవు కాంతు లీనుచున్

ఉ. ఎక్కడనుండియో చెవుల • కింపుఘటించెడి రాగ మెవ్వరో
చక్కగ పాడుచుండిరది • స్వాంతమునెల్ల గిలించుచుండెనే
చక్కని సేవిలాసవతి • చల్లగ నుల్లము పల్లవింపగా
ప్రక్కననుండి నాథునికి • పాడెడినో? అతడెంత ధన్యుడో?

ఉ. ఆరయ భాగ్యవంతులును • సంచిత సౌఖ్యవితానవంతులౌ
వారును, సౌధరాజముల • భద్రముగా శయనించియుందు రీ
చారువసంతకాలమున • చక్కని వెన్నెలరాత్రివేళ, న
వ్వారును లో, విచారముల • పాల్పడినందన మెంతొ సాయమౌ

చ. కటకట, వారికేమి యరుదె • కన్గొన నావలచాట ప్రక్క దా
మటమటనైన కాయముల • నాకలిమంట దహించుచుండగా
బోటబోటరాలు నశ్రువుల • బొక్కుచు స్రుక్కెడు బీదవారలే
యిటునటు దొర్లుచుండి, రిల • యెల్లమదమ్ముబహిష్కరించెనా

ఉ. వెన్నెల చీరగట్టి, కడు • వింతగ చందురు చందనంబు దా
నెన్నొన టెంత బొట్టునిడి • నీలగళంబున తారహారముల్
వెన్నెలకన్నియ త్తరుణి • చిత్రితమై కడు జాలినొందు, ని
ల్చున్నది రాత్రిమేడలిట • లూరక దాము ద్రవించుచొప్పునన్

మ. అకటా యొందు మనుష్యజాతుపు స్వనం • ఘనానంద సంధాన, మిం
చుక నాలోచనజేయు డెవ్వరయినన్ • జొప్పింపగానున్న వా
రికి కష్టావళులెన్నొ చేకురును, కా • త్రే బీదవారెల్ల వి
శ్వకుటుంబంబున భాతృసంతతి ధనీ • సర్వంబు గొంపోవు దే?

చ. అగునిపుడర్ధరాత్రి జగ • మందు సుషుప్తియహానిరంకుశం
బగునధికారమూని జన • వశ్యము జేసికొనంగ జాలి; నే
ర్పుగ తన మంత్రశక్తిని న • పూర్వపువిస్మృతి గొల్పి, మచ్చుమం
దొగినిడి, స్వప్నలోకమున • కొక్కటనీడ్చును సౌఖ్యవంతులన్

ఉ. కానివియోగి దుఃఖమున ♦ కన్నులమూయుడు చెంత జేయుమా
హానిమొనర్చు హంతకుడు ♦ హస్తము నెత్తెను వాని గ్రమ్ముమా?
స్తేనుడు చౌర్యముం దలుపు ♦ తెంపువహించెను గ్రాలజేయుమా?
పూనెదు నాత్మహత్యకటు ♦ బొమ్ముమువడిన్ హతభాగినిద్రరో

ఉ. ఎంచినకొల్దిబుద్ధి జలి ♦ యించెదు విశ్రమమందగోరి వీ
క్షించిన కొల్దికండ్లు ముకు ♦ ళించెదు నించుకశాంతిబొంద, సా
గించిన కొల్దిపద్యము ము ♦ గింపు తలంపు కలంపు హా! ప్రవే
శించెదు నిద్రదేవత వి ♦ చిత్రముగా బసుమేను పాన్పుపై

---

# ఆంధ్రసారస్వతము

[అయ్యలుసోమయాజులు వేంకటసుబ్బారావుగారు ఎం. ఏ. ఎల్. టి]

(గతసంచికానుబంధము)

పావులూరి మల్లన గణితశాస్త్రమును రచించెను. నేటికిని దీనిని పావులూరిగణితమని పెద్దలు చెప్పెదరు.

రంగనాథరామాయణము ద్విపద కావ్యము. తోలుబొమ్మలాడువారు దీనిని శ్రావ్యముగా పాడుదురు.

భాస్కరరామాయణము సంస్కృతమునకు సరియగు నకలు కాదు. భాగవతమునకు వచ్చినగతియే దీనికిని తటస్థించినది. భాస్కరకృత భాగమంతగా లేదు. భాస్కరుని కవిత్వము రసవంతముగా నుండును.

కేతన తిక్కన సోమయాజితో సమానుడనవచ్చును. అభినవదండి యను బిరుదము గల మహాకవి. ఆంధ్రభాషాభూషణకర్త. కవితచెప్పి ఉభయకవిమిత్రుని మెప్పించిన మేటి. దశకుమార చరితము కాదంబరి ఆంధ్రమున పద్యకావ్యముగా రచించిన కవిశ్రేష్ఠుడు. కేతన కవిత్వము తిక్కనాదుల కవిత్వముతో సరిరాకపోయినను సలక్షణమై మధురముగా నున్నది. అని కవులచరిత్రలలో నున్నది.

కేతన వివిధకళానిపుణుడు. కేతన దశకుమార చరిత్రము ఉత్తమకావ్యము. మూడవఆశ్వాసములో అవంతిసుందరికథ అంతయు మనోహరముగ నున్నది.

దశమాశ్వాసమున గృహపత్ని యగు రత్నావతిని త్యజించి వేశ్యాలంపటుడై

బలభద్రుండు స్వభార్యను వెడలఁగొట్టెను.
మాతృగృహము చేరి ఆనాతి

పేర్కొనఁ దల్లిదండ్రులకుఁ బెంపుగఁ
బుట్టితిఁ బుట్టిమొంతయుం
గర్వితుఁడైన కాంతునకుఁ గర్మవశం
బున నాలనైతినా
కోర్కులమీఁదఁ దీర్పని ఘోరని
కారము లోర్చుచున్నచో
మార్కొని మాలదైవము క్రమంబున
నన్నిడఁజేసె నాకికన్
తల్లి ప్రాణముతోడి చాపునకడుం
డిప్పైన నిల్లాలికిన్
దల్లిదండ్రిని జేగియున్కి దలఁపం
దైన్యంబు నాభర్తని
న్నుల్లంబానున్నవిత్రోచెఁ బ్రాణవిరహో
ద్యోగక్షమం బందెనా
యుల్లంబింతులు వొంద రేవరుల పై
వాసేతుఁ జింతిల్లరే

పై పద్యములో రత్నావతి మాటలు దుఃఖమును పుట్టించును.

దుష్టశీలుఁడు భూమని గూర్చి మొండివాని పలుకులు

"తల్లివినీవు ధన్యకుఁడు తండ్రియుసం
శయమింతపట్టు నీ
యుల్లమునం దెలింగియును నువ్వని
పల్కులు పల్కెదంక నీ
తల్లితనంబుచాలు నుచితంబని
పల్లినసల్లు తల్లియుం
గిల్లియు నెల్లు వాపమునుగీపను
నీవతి కేను జెప్పెదన్

కేతన విజ్ఞానేశ్వరమును కూడ వ్రాసెను. ఇక్కడ కేతన కవనము మిక్కిలి కఠినముగా తోచును. ధర్మశాస్త్రవిషయములను చిన్న పద్యములలో వ్రాసెను. భావచాలవఱకు అచ్చతెనుఁగు. దేశీయాపదములు క్రొత్తగా కాన్పించును. వ్యవహారకాండయందు అన్వయకాఠిన్యమును భావగాంభీర్యము కన్పట్టెడిని తీక్ష్ణముగా నాలోచించిన గాని భావము బోధపడదు. ధర్మములను అంతసూక్ష్మముగా నిముడ్చుట ఆభాషాప్రయోగమునకు కేతన నేర్పరితనము. నకు తప్ప ఇతరులకు సులభసాధ్యము కాదు.

మారన మార్కండేయపురాణమును వ్రాసెను. తిక్కనసోమయాజి శిష్యుడు. సోమనాథుఁడు బసవపురాణము వ్రాసెను. మంచన కేయూరబాహుచరిత్ర కృతికర్త. చిన్నకోట పెద్దన కావ్యాలంకారచూడామణిని వ్రాసెను. పెద్దన పెద్దవిద్వాంసుఁడైనను కవనము మధురముగా నుండదు. వాడికి సింగన్న తిక్కనవంశములోనివాఁడు పద్మపురాణమును వ్రాసెను. వేములవాడ భీమకవి చాటుధారలే కాని ప్రసిద్ధికెక్కిన కావ్యము లేవియు కానరావు.

(సశేషము)

# శ్రీకృష్ణుఁడు ద్రౌపదీమానరక్షకుఁడు కాఁడా?

[శిష్ట్లా వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు]

ప్రబుద్ధాంధ్ర ౭వ సంపుటము ౭వ సంచికలో బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసిన "మహాభారతగాథా విశేషములు" అను వ్యాసములో "శ్రీకృష్ణుఁడు ద్రౌపదీమానరక్షకుఁడా?" అను సంగతిని జర్చించుచు, ద్రౌపదీవస్త్రాపహరణమే జరుగలేదనియు, శ్రీకృష్ణుఁడు ద్రౌపదీమానరక్షకుఁడు కాఁడనియు వ్రాసిరి.

అందుకుఁ గారణముఁ ద్రౌపదీపరాభవము భారతమునందు ౧౩ సారులు ప్రశంసకు రాగా నందు మూఁడుచోట్ల మాత్రమే వస్త్రాపహరణముమాట వచ్చి మిగిలినస్థలముల నామాటయే రాక పరాభవము మాత్రమే వచ్చినందున వస్త్రాపహరణముకల్లయని వ్రాయుచు, ప్రాచీనమహాకవులగు భాసుఁడు భారవి మొదలగువారు తమ గ్రంథములలో ద్రౌపదీకచగ్రహణము మాత్రమే చెప్పి, వస్త్రాపహరణము సూచింపకుండుట కూడ ద్రౌపదీవస్త్రాపహరణ మబద్ధమనుటకుఁ గారణమనియు, ఆ కారణముచేతనే శ్రీకృష్ణుఁడు ద్రౌపదీమానరక్షకుఁడు కాఁడనియు వ్రాసిరి.

భారతకథ జరిగిన కాలములో నుండి తానంగతు లనేకములను స్వయముగాఁ జూచియు, కొన్నిఁటిని వినియు నున్న వేదవ్యాసమహర్షి, ఆకథ జరిగిన కొంతకాలమునకు భారతమును రచియించియుండెను. అటుపిమ్మట ననేక సంవత్సరములకుఁ బుట్టి గ్రంథములను రచియించిన భాసప్రముఖకవీంద్రులు వస్త్రాపహరణము మాట దమ గ్రంథములందు సూచింపనే లేదనుటఁ జూచి, ఆకాలమునం దున్న వ్యాసమహర్షి వ్రాసినది యబద్ధమనియు నీకవులు వ్రాసినది నిజమనియుఁ దలఁచుట సమంజసమని తోఁచదు. భాసుఁడు మొదలగు కవులు రచియించినదే నిజమనకపోతే యిటీవలి యాంధ్రకవులు తాము రచియించిన నాటకాదులలో ద్రౌపదీ వస్త్రాపహరణమును వ్రాసిరిగదా. దానినేల నిజమని నమ్మరాదు? ఈశాస్త్రిగారీగ్రంథముల సముతము జూచియుండకపోరు. చూచినను వీరు కవులు కారనుతలఁపుచేత గాఁబోలు వాని నంత పాటించియుండరు. వీరుమాత్రము కవులేల కారు? వారు ఆకాలమున వ్యవహరింపఁబడుచున్న సంస్కృతకవులయితే వీరీకాలమున వ్యవహరింపఁబడుచున్న యాంధ్రకవులు, ఆకవులకుఁ దెలిసినంతమాత్ర మీకవులకుమాత్రము తెలియదా?' కాఁబట్టి భారతమునందు అక్కడక్కడఁ గల దానినిబట్టి యీ యాంధ్రగ్రంథములలో నా గ్రంథకర్తలు వ్రాసినదానిమాత్రమేల నమ్మరాదు? ఇదియు నమ్మఁదగినదే.

మూలగ్రంథము ననుసరించి భాషాంతరీకరణము జేయునప్పుడా మహాకవీశ్వరులు కొన్నిస్థలములఁ గథలఁ గల్పనచేసి పెం

చిరి. ఒక్కొక్కచోటగల కథలను దీసివేసిరి. ఇట్టి స్వాతంత్ర్యము గ్రంథకర్తలుంచుకొనుచుండుట యీశాస్త్రులుగారికి మాత్రము తెలియదా? అట్లే భాసుఁడు మొదలగువారును సంస్కృత మూలగ్రంథములోనేదేని నొకసంగతి నొకగ్రంథముగా వ్రాసినప్పుడు కొంతసంగతి విడిచి, అంతకంటె రమ్యమును దేఁదలఁపుకో మఱియొకటి గల్పించియుండవచ్చును. అంతమాత్రముచేత ద్రౌపది వస్త్రములను దుశ్శాసనుఁ డొలువలేదనియుఁ, గృష్ణుఁ డామె మానసంరక్షణమును జేయ నవకాశమే లేదనియు దలంచుట యుక్తమనితోఁచదు.

మఱియు వ్యాసమహర్షి భారతకథ జరిగిన కాలములోనున్న మహానుభావుఁడు. అంతేగాక విష్ణుమూర్తియొక్క యేకవింశత్యవతారములలో నీమహనీయునిది నయిత మొక యవతారము. అట్టి మహనీయుఁ డొకవేళ గొన్నిసంగతులఁ జూడకున్నను దెలియక వ్రాసెనని తలంపఁదగునా? విశేషించి యింకొక్క సంగతి:—వ్యాసుఁడు సామాన్యమానవుఁ డని తలఁచినను భారతవంశోద్ధారకుఁడు. ఎవరయిన నేసంగతి నయినఁ బ్రసంగించునప్పుడు తనకు గాని, తన వంశజులకు గాని, యపకీర్తికరమగుదానిని దాఁచియుంచుట లోకసహజమయి యుండగా తన సంతతి కత్యంతాపకీర్తికరమగు ద్రౌపదీవస్త్రాపహారణమును వాగ్రూపముగా నయిన గాక గ్రంథస్థముఁ జేసి యట్టి యపకీర్తిని శాశ్వతముగా నిలుచునట్లు చేయునా?

ద్రౌపదీపరాభవ ప్రసంగమున పన్నిస్థలముల యందును వస్త్రాపహారణము మాట రాలేదనుట కీక్రిందిసమాధానము వ్రాయుచున్నాను.

ఎవరయిన నెచ్చటనయిన జరుగు వివాహమహోత్సవ సందర్భమున కాహ్వానింపఁబడి యచ్చటికిఁ బోయి, వచ్చిన పిమ్మట నచ్చట జరిగిన వేడుకలనెల్ల నెవరితో నయినఁ జెప్పుచు, అచ్చటఁ దాఁగన్న వినోదములను అవసరమును బట్టి పలుమారు చెప్పవలసివచ్చునే గాని, యన్నిటికంటె ప్రధానమయినదే యయినను "నాకు పెండ్లివారు అన్నము పెట్టినారు. నేను కడుపు నిండా తిన్నాను" అని పలుమారులు చెప్పవలసివచ్చునా? పెండ్లి కాహ్వానింపఁబడి, పోయియుండగా వా రన్నము పెట్టరా? ఈమహనీయుఁడు తినఁడా? ఈసంగతి ప్రతి ప్రసంగమునందును జెప్పనంతమాత్రముచేత నీతఁ డక్కడ నన్నముఁ దినలేదని మనమెంచవలసినదేనా? అట్లే భారతమునందనేక స్థలముల ద్రౌపదీపరాభవ ప్రసంగము జరిగినను "జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెంబేల" అనునట్లు అందఱు నెఱిఁగిన వస్త్రాపహారణ ప్రశంస ప్రతిచోటను రావలసినంత యగత్యమేమికలదు? అంతమాత్రముచేతనే ద్రౌపదీవస్త్రములను దుశ్శాసనుఁ డొలువలేదనవచ్చునా? శ్రీకృ

ష్ణుఁ డామె మానసంరక్షణఁ జేయ లేదనఁ జెల్లునా?

శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు ద్రౌపదీపరాభవ ప్రసంగము భారతమున ౧౩ స్థలములలో వచ్చియుండఁగా నన్నిస్థలములయందును వస్త్రాపహరణప్రసంగము రానందున నది యబద్ధమని వ్రాసిరిగదా. అందుఁ గొన్నిటికి సమాధాన మీదిగువ వ్రాయుచున్నాఁడను.

మహాభారతము సభాపర్వములో దుశ్శాసనుఁడు ద్రౌపదికట్టినబట్టల నొలుచునపుడు శ్రీకృష్ణుని యనుగ్రహముచే నా పరమపతివ్రతకు వస్త్రము లక్షయములయి వలిచినబట్టలు కుప్పలుగా బడినవని యున్న సంగతిని శ్రీ శాస్త్రిగారు కూడ చదివినట్లే వ్రాసిరి. నారాయణాంశ సంభూతుఁడని యంగీకరించకపోయినను పరమతపోధను డయిన నగు వ్యాసమహర్షి రచియించినదియు, పంచమవేదమని ప్రసిద్ధి కెక్కినదియునగు భారతమూలగ్రంథమున నీసంగతి నొక్కచోట వివరించినఁ జాలదా? ప్రతిచోటను వ్రాయునంతమాత్రమున మొదట వ్రాసినది యబద్ధమనఁ జెల్లునా? దీని కుదాహరణము పైన వివరించిన వివాహభోజన మేనని చదువరులకు విన్నవించుచున్నాను.

ప్రథమద్యూతానంతరము ధృతరాష్ట్రుఁడు ద్రౌపదికి వరములిచ్చునప్పుడు వస్త్రము లొలిచినట్టుల గ్రంథమునఁ జెప్పకుండుట యొక కారణమట. అంతకు ముందు కొంతసేపటికిఁ బట నల్లను జూచుచుండ సభలో వస్త్రాపహరణము జరిగియుండగా "కోడలా! నిబట్టలను నాకొడుకు విప్పినాఁడా?" అని ధృతరాష్ట్రుఁ డడుగవలెనా? "మామగారూ! మీ కొడుకు నాబట్టలను విప్పినాఁడు" అని ద్రౌపది చెప్పవలెనా? అప్పు డీమాట యేలరావలెను? ధృతరాష్ట్రుఁడు ద్రౌపది నూరార్చి వరములిచ్చునప్పుడు, ఆమె యోగ్యత నెంతెగా గొనియాడెనో శాస్త్రిగా రెఱుఁగరా? ఎఱుఁగుదురు. ఎఱిఁగియు దుశ్శాసనుఁడు కొప్పు బట్టి సభ కీడ్చుకొని వచ్చినంతమాత్రమున కే ద్రౌపది నంత కొనియాడె నని తలఁచిరి కాఁబోలు? ఈ పరాభవ మొక్కటి సహించినందుల కే యింత కొనియాడవలెనా? నీమూలమున నావంశ మంతయుఁ బావనమయ్యె ననుట మొదలగు వాక్యములచే నామె చారిత్రము నగ్గించుచుఁ బలికెనే, అంతపొగడుట కీసభ కీడ్చుకొని వచ్చిన నామె వచ్చిన కారణ మొక్కటియే చాలునా? చాలదు. విశేష మేమో యుండవలెను. అదియే వస్త్రము లక్షయములయియుండుట. అట్టి యక్షయవస్త్రము లేలరావలసివచ్చెను? విడుచుటచేత. ఎవరు విడిచిరి? దుశ్శాసనుఁడు. ఈసాధ్వీ పాతివ్రత్యమహిమచేత నా కృష్ణుఁడయినను వస్త్రము లక్షయములగునటులఁ జేసెను

గాని, యేదుర్మార్గుఁడయిన నేస్త్రీయొక్క వస్త్రము నయిన బలవంతముగా లాగఁదొడఁగి యున్నప్పుడా స్త్రీ యా కృష్ణు నొక్కసారి కాదు. వేయినాళ్లు తలఁచినను వస్త్రములక్షయములయి విడిచినవి కుప్పలుగాఁ బడి దీయువాని చేతులునొప్పిపుట్టి దేహము చెమటలు కారునా? ఇందుకుదాహరణముగా, కొన్ని యేండ్లక్రిందట, పంజాబులో జరిగిన ఘోరకృత్యములలో నెందఱు స్త్రీల వస్త్రము లొలువఁబడిరి? వారిలోఁ గొందఱైన చివర కొక్కరయినను భగవన్నామము స్మరింపలేదా? వారందఱు కులటలుగాకున్నను ద్రౌపదినిఁ బోలిన పతివ్రతలు కానందుననే వారి వస్త్రము లక్షయములు కాలేదు. దుశ్శాసనుఁడు బట్టలొలుచుట దుర్మార్గమయినను సహజమయినను ఆ నారీరత్నము వస్త్రము లెన్ని యొలిచినను దేహము వస్త్రవిహీనము గాకుండుటయే మిగులఁ గొనియాడదగిన విషయము. ఇది యామె పాతివ్రత్య మాహాత్మ్యమువలన జరిగినను కృష్ణుని యనుగ్రహమువలన గలిగినను ఆసాహసియురాలు స్తోత్రమునకుఁ దగియున్నది. ఇట్టి మహామహిమ మా సతీతిలకమునకుం దగియుండుటచేతనే "నా కోడండ్రలో నీవే యుత్తమురాల" వని ధృతరాష్ట్రుఁడు ద్రౌపదిని గౌరవించి వరములిచ్చి యాదరించి పంపెను.

దుశ్శాసనుఁడు ద్రౌపదికట్టిన బట్టలను విప్పినమాట యథార్థమే యయ్యెనేని యానమయమున సభలోనున్న మహాబలవంతులును పరమధార్మికులు నగు భీష్మద్రోణ విదురాదు లట్టి ఘోరకృత్యము జరుగుచుండగా నీతిమార్గమున నలవిగాకున్న బలము నుపయోగించి యయిన దాని నుడుగఁ జేయరా? అట్టివారలఁ గని దుశ్శాసనుఁడు భయపడఁడా? కావున నా పని జరుగనే లేదని కొందఱనవచ్చును. రాజభార్యయు, అంతఃపురములో నుండఁదగినదియు, పతివ్రతయు నగు ద్రౌపదిని, కొప్పుబట్టి దుశ్శాసనుఁ డీడ్చుకొని సభలోనికి వచ్చినప్పుడు మాత్రము వీరు లేరా? అప్పుడు వీరి బాహుబలధర్మము లేమయినవి? ఇది యంతయు నామె కర్మానుభవమని యొక్కమాటవ్రాసి గ్రంథవిస్తరభీతిచే నీ ప్రశ్నకు సమాధాన మింతటితో ముగించుచున్నాను.

మఱియు నమానుషబలుఁడగు భీమసేనుఁడు తన యెదుట తన భార్యావస్త్రములను విప్పుచుండగా వీరల తలఁ బగులఁగొట్టక యుండునా? యనియు ననవచ్చును. దీనికిని పైన వ్రాసినదియే సమాధానము. ఇంతేకాక యీమహాబలసంపన్నుఁడు "యమపాశబద్ధుఁడయిన జీవుని చందమున" ధర్మరాజను పాశముచే బంధింపఁబడి యుండుటయు నొక ముఖ్యకారణము.

శ్రీకృష్ణ ధృష్టద్యుమ్నాదు లడవిలో నున్న పాండవుల నోదార్చవచ్చినపుడు వస్త్రాపహరణముమాట రాలేదనుటకు.

[[illegible] దుశ్శాసనుఁడు చీర [illegible]. [illegible] చీర వలువలు. వస్త్రాపహరణ సమయమున దేహము వస్త్రవిహీనము కాకుండ కాపాడిన శ్రీకృష్ణుఁ డీసంగతి నెఱుఁగఁడా? లేక మఱచెనా? లోకమెల్లఁ జెప్పుకొనుచున్న దుర్మార్గుని దుశ్శాసనుని ధూర్తము వినలేదా? అదిగాక తనకంటె పెద్దలకు వారితో వారెఱిఁగి యున్నదియు నమిత దుఃఖకరమైనదియు నగు నీసంగతి నాయన సిగ్గువిడచి యేల మరలఁ జెప్పవలెను?

ఇఁకను, కీచకుని వలనఁ గలిగిన భంగపాటును భీమునితో రహస్యముగా జెప్పునప్పుడు, ద్రౌపది "భర్తగారూ! మీరు చూచుచుండగా దుశ్శాసనుఁడు నా బట్టలను విప్పినాఁడు" అని చెప్ప లేదఁట. ఇదియు నొక గొప్ప కారణ మఁట. రౌద్రము మూర్తీభవించిన చందమున నున్న భీముఁడు ధర్మరాజను పాశముచే బంధింపఁ బడి పరాక్రమ హీనుని చందమున నున్న యాతని యెదుట జరిగిన పనిని ద్రౌపది భీమునితో మరలఁ జెప్పవలెనా? "నీబట్టల నానాఁడు దుశ్శాసనుఁడు విడువలేదా? అట్లే కీచకుఁడయినను నిన్ను బట్టవచ్చినాఁడే గాని బట్టలను విప్పలేదు గదా. ఇందున నీకు గలిగిన నష్టమేమి?" అని భీముఁ డోదార్పవలెనా? బట్టల నొలుచుట యను నది మగల నవమాన మగు పనిగదా. ఆ సంగతి, నెఱిఁగియున్న భర్తతో మరల జెప్పినప్పుడాభర్త మనోవ్యథ యనుభవైకవేద్యము. ద్రౌపది యీమాత్రపు సంగతి నెఱుఁగని మూఢురాలా?

ద్రుపద పురోహితుని రాయబారములోని ప్రశంస:—

ద్రుపద భూపతి యంపిన పురోహితుఁడు ధృతరాష్ట్రుని సభలో మాట్లాడునప్పుడు వస్త్రాపహరణముగూర్చి సంస్కృత భారతములో లేకున్నను ఆంధ్ర భారతమున [illegible]. దీనికి జవాబు (అనగా సాంప్ర గ్రంథములను గుఱించి) పైన వివరించియే యున్నాను.

మొత్తముమీఁద నింకొక్క సంగతి:—

శ్రీశాస్త్రిగారు వ్రాసినప్రకారము భారతములో ౧౩ పర్యాయములు వచ్చిన ద్రౌపదీపరిభవ ప్రశంసలో ౩ పర్యాయములు వస్త్రాపహరణ ప్రసంగము వచ్చినది గదా; మిగిలిన వానిలో కొన్ని స్థలములలో ద్రౌపది తన నోటిమీఁదుగా దన వస్త్రము లొలువఁ బడినవని చెప్పవలసి వచ్చినది. స్త్రీజనసహజ మయిన సిగ్గును విడచి యీవిషయమును బలుమాఱులు గాని, ఒక్కమాఱు గాని చెప్పుట యెంత కష్టమో చదువరు లూహించుకొనియెదరుగాక.

ఇది యట్లుండగాఁ బరపురుషుఁడు తన భార్యావస్త్రము నపహరించినసంగతి చెప్పుట భర్తయయిన వాని కెంతకష్టమో యూహింపుఁడు. ఆ కారణముచేతనే నను

యమువచ్చి పాండవులు ద్రౌపదీపరాభవ మును ముచ్చటించినను వస్త్రాపహరణమును జెప్పలేదని మనము తలంపవలసిన సంగతి యయి యున్నది. కనుకనే వ్యాసమహర్షి యీసంగతివ్రాయ నుద్దేశింపలేదు.

దుశ్శాసనుని వధ సమయములో భీమునకు వస్త్రాపహరణము స్మృతికివచ్చు టచేతనే తన ప్రతిజ్ఞయు జ్ఞప్తికివచ్చి, అ ప్పుడు చూపరులు, ఇప్పుడు వినువరులు, భయపడునట్టి ఘోరమరణము దుశ్శాసను నకు గలిగించెను. లేదేని, అట్టి బీభత్స మగు వధ సంభవింపదు.

దుర్యోధనునిఁ జంపునప్పుడు దు ర్మార్గుఁడు చేసిన విపరీతమగు క్రూరకృత్య మగుటచేతను, వాఁడు చచ్చునట్టి సమయ మగుటచేతను, ఆక్రోధముమీఁద భీముఁడు వస్త్రాపహరణముసంగతిఁ జెప్పియుండును గాని, యిదివఱకీమాట చెప్పుటలోఁగల కష్టమిప్పుడు లేనికారణముచేతఁగాదు.

మిగిలినస్థలములలోఁ బరాభవప్ర శంస నామమాత్రము వచ్చినను వస్త్రాప హరణమును జెప్పవలసినంత యవసరము కలుగలేదు.

శ్రీ శాస్త్రిగారు చేసిన వేఱొక యాక్షేపణ:—

వస్త్రాపహరణసమయములో శ్రీకృ ష్ణుఁడు సాళ్వునితోఁ బోరుచు దూరమున నుండెను. ద్వారకలో లేఁడు. ఆ కారణము చేత ద్రౌపదీమానరక్షకుఁడు కాఁడు. ఏలే లేదనుతలంపుతోఁగాఁబోలు అది జరుగలే దని వ్రాసిరి. ఈ యాక్షేపణ వింతగా ను న్నది. శ్రీకృష్ణుఁడు మానవమాత్రుఁడే యయి యెంతగొప్పవాఁడయినను ద్వారక యందే కాని, ఆనగరమునకొకఫర్లాంగు దూరములోనున్న యూరిలోగాని, లేదా, ఆపట్టణమునందే వేఱొకవీథియందు గాని కాపురమున్నను సాధ్యపడదు. కారణము:- ఆనగరమందే వేఱొకవీథిలో నున్న కృష్ణు నకు, ఇచ్చట నాపదలోనున్న ద్రౌపది, ఒక్కసారి కాదు, లక్షసారులు "కృష్ణా" యని పిలిచినను, అతనికి వినఁబడదు. ఎవ రయిన నెంతపరుగుపరుగునఁ బోయి యెఱిఁగించి నను వస్త్రము లొలుచు సమయమున కా తఁడు రాఁజాలఁడు. అథవా పిలుపు వినఁ గానే యొక లక్షబట్టలను మూటఁగట్టు కొని చంకనిడికొని బరుగుపరుగున వచ్చి నను అప్పటికే పుణ్యకాల మాఖరగును. పోనిండు, వస్త్రములొలుచు తఱికే వచ్చి నను ద్రౌపదికట్టినపుట్టమును దుశ్శాసనుఁడు పూర్ణముగా విప్పినతర్వాతగాని, కొంత విప్పినతర్వాతగాని, యీమానవకృష్ణుఁడు బట్ట నందీయవలెను. అప్పటికి నగ్నమూ ర్తిగనో దేహము బయల్పడకపోదు. అదిగాక దుశ్శాసనుఁడు వేఱొకవస్త్రము నందుకొననీయునా? ఆస్థితిలో మాన సంరక్షణ మెట్లు కలుగును? అతనికి ద్రౌ పదీమానరక్షకుఁ డనుబిరుదెట్లువచ్చును? కావున కృష్ణుఁడు మానవమాత్రుఁడను శాస్త్రి చె ప్పెదియుఁ బొసఁగదు.

శ్రీకృష్ణుఁడు మానవదేహముదాల్చిన నారాయణమూర్తి యని మన శాస్త్రిగారు సమ్మతించిరేని అతఁడు ద్వారకలోనే కాఁడు. సప్తసముద్రముల కావల నున్నను ద్రౌపదిపిలుపు వినఁబడుటయు, అక్కడనుండియే యాతని తలంపు ననుసరించి, యెన్నివస్త్రములొలిచినను దేహమునందణుమాత్రమయిన వస్త్రవిహీన మగు ప్రదేశము బయల్పడకుండ వస్త్రములక్షయములగుచుండుటయుఁ దటస్థించును. ఇంతకును మనశాస్త్రిగారు కృష్ణుఁడు నారాయణాంశసంభూతుఁడని తలంతురో, మానవమాత్రుఁడనితలంతురో తెలియదు.

వ్యాసుఁడు, ఇన్నిచోట్ల ద్రౌపదీపరాభవప్రశంస వ్రాసియుండగా నన్నిచోట్లను వస్త్రాపహరణమును వ్రాయకుండుటకు గారణము ఆమహనీయుఁడు మఱచి కాదు. అన్నిస్థలములను వస్త్రాపహరణప్రశంస రానందుననే వ్రాయలేదు. వచ్చినచో వ్రాసియేయుండును.

అన్నిటికంటె ముఖ్యముగా వస్త్రములు విప్పినట్లు స్పష్టముగా సభాపర్వములోనుండుటయే చాలును.

భారతమునందుగల దేవమహిమలన్నియు నబద్ధమని శ్రీ శాస్త్రిగారు తలఁచినట్లు కనఁబడుచున్నది. అట్లు లయ్యేని భారతకథయంతయుఁ గల్పితమే కాని జరిగినది కాదనవలెను. శాస్త్రిగారట్టు లనరా? అదియే సత్యమయ్యేని గ్రంథము లన్నియుఁ గల్పితకథలే గాని జరిగినవి కావనియుఁ జెప్పవలసివచ్చును. అట్లుచెప్పినప్పుడు (గ్రంథములను నమ్మియున్న మనము) దేవుఁడే లేఁడనవలెను. అప్పుడు జననమరణాదులును స్వభావసిద్ధములేగాని దైవయత్నమే లేదనవలెను. ఇది యెంత బాగుగనుండునో చదువరులే యోచింతురుగాక.

పైన నాయింత చర్చించిన సంగతులనుబట్టి శ్రీకృష్ణుఁడు నారాయణాంశసంభూతుఁడనియు, ద్రౌపదీవస్త్రాపహరణ మబద్ధము కాదనియు, శ్రీకృష్ణుఁడు ద్రౌపదీమానరక్షకుఁడే యనియు నాయభిప్రాయము. చదువరులీ రెంటిని గమనించి నిజము నెఱుఁగుదురుగాక.

దీనినిగుఱించి యింకను జర్చింపవలసిన విషయము లున్నట్లు నాకు గొంచెము తోఁచుచున్నను, చదువరులకు విసుగు జనియించునని తలంపున నింతటితో విరమించుచున్నాను.

ఈవ్యాసము నాకృష్ణుని యనుగ్రహమువలన వ్రాసినదే గాని నాస్వశక్తివలన వ్రాసినది కాదనియు, నిందు దేవియమయిన తొందరవాక్యము లున్న నవి విషయము ననుసరించి యాపురుషోత్తముఁడే వ్రాయించెననియు తలఁచి శ్రీ శాస్త్రిగారు కోపపడకుందురుగాక.

# కిమిడి రాజుల యొక్క పూర్వోత్తరం

కిమిడిసంస్థానంయొక్క పూర్వోత్తరం యేమంటే—

పూర్వం గజపతివారు అని వడ్డెరాజులు మహాప్రబలులై సకలదేశాలున్ను ప్రభుత్వంచేశినారు. తదనంతరం అశ్వపతులు ప్రబలులై నరపతి గజపతి రెండుశింహాసనాలు వారినిజయించి సకలదేశాలు ఆక్రమించుకునిరి గనుక కాలవశంచొప్పున సమస్థానం కొద్దిలోవచ్చి కిమిడినారాయణపట్నందేశాలు గజపతివారికిని వాన స్తళములు గనుక యీభూములు అంతా అరణ్యములుగా వున్నందున మ్లేచ్ఛుల్లు వేరు దస్తులో చేరక యీసంస్థానీకులయిన రాజులు రాజ్యభారం చేసుకుంటూ వచ్చినారు—యిట్లాపిడివరుపిడిల జర్గగా వకరోజుకు గజపతిజగన్నాధదేవు విక్రమదేవు వీరవిక్రమదేవు అని ముగ్గురుకొమాళ్లుకలిగిరి. వీరిలో సర్వజ్యేష్ఠుడైన జగన్నాధదేవుకు వీరకృష్ణదేవు అనే కొమారుడున్ను రెండోవాడైన విక్రమదేవుకు నందర నారాయణదేవు అనే కొమారుడున్ను మూడోవాడైన వీరవిక్రమదేవుకు విజయగోపాలదేవు అనే కొమారుడున్ను యీప్రకారం కొమారులు సంభవించిరి గనుక వీరు త్రయస్వాములైన తర్వాత వీరకృష్ణదేవు జగన్నాధదేశం తఖ్తు బాణాపురం పరియంతమున్ను। నందర నారాయణదేవుకు పెదకిమిడి। విజయగోపాలదేవుకు చినకిమిడి యీప్రకారం యీదేశాలు యీముగ్గురి సంతతివారు వేరువేరు రాజ్యంచేసుకుంటూ వున్నారు. యిదివర పరియంతం వీరకృష్ణదేవు సంతతి వడ్డెరాజులు జగన్నాధదేశం తఖ్తు బాణాపురంతాలూకా ప్రభుత్వం చేసుకుంటూ వున్నారు. మహారాష్ట్రులు యెంతబలవంతులైనా బాణాపురం సాధించడానకు అసాధ్యంగనుక యిదివరకు జమీందారీ పోకుండా వున్నది. యిప్పటికి వారు కిమిడివారికి జ్ఞాతులమని అనుకుంటారు వారికి వీరికి అభిమానాలు వకటి చినకిమిడకు ప్రభువైన విజయగోపాలదేవుకు కొమారుడు వీరకృష్ణదేవు యితనికొమారుడు భీమదేవు యితనిపుత్రుడు వసుదేవు యితని

కూనుడు పురుషోత్తమదేవు యితని నందనుడు గజపతిపురుషోత్తమదేవు| యితని కొమారుడు నారాయణదేవు| యితను బహు శౌర్యవంతం కలిగినవాడు వీరివంశమందు పుట్టినరాజులంతా శౌర్యవంతంకలవారు గాని సామాన్యులుగారు. గజపతి నారాయణదేవు చరియలు యేమంటే—

పూసపాటివారికిన్ని వీరికిన్ని వయిరంగా వుండేది. యిట్లావుండగా యింతలో హైదరాబాదునుంచి యీదేశాల్కు నవాబు వచ్చిరి గనుక నారాయణదేవువారిని కల్సుకుని పూసపాటివారిని తమరు వుడాయించి వారి సమస్థానమే తీశి పారవెయ్యావలెనని ఆలోచనచేశి నవాబును మద్దతు చేసుకుని పూసపాటివారిమీదికి యుద్ధానకువచ్చి మాహిందిగి యుద్ధానకు వుపక్రమణ చేశెవరుకు వుభయసేనలున్నూ తారశిల్లి లడాయీచేశినంతలో పూసపాటివారు బలం చాలనందున మించి ఘణంశా యుశేకపోయిరి గనుక అంతట తిర్గి నారాయణదేవు జయాన్నిపొంది. తమ యథాస్థానం ప్రవేశించినాడు, నవాబు శ్రీకాకోళం ప్రవేశించినాడు. తరువాత నారాయణదేవు పూసపాటివారు యింత లొంగిపోయినప్పుడు మనం వుపేక్షశాయడం మంచిది కాదు. అని జమయ్యాతు చేస్తుని పునః విజయనగరంమీద్కి రావలెనని దండు నెత్తిరి గనుక ఆవర్తమానం విని పెదవిజయరామరాజుగారు వారుయింటిమీద్కి రాకముందే తమ ఫంజయావత్తు జమయ్యాతు చేస్తుని జగపతినారాయణదేవువారికి యెదురుగుండా పోయి వారితో యుద్ధంచేశి కొంతసైన్యం హతంచేశి జయించి తమరు చెప్పినట్టు వినేలాగున చేస్తుని తిర్గివచ్చిరి గనుక శ్రీకాకుళం హాకేలికి వచ్చిన నవ్వాబు పూసపాటివారి శౌర్యవంతం చూచి యితను బలవంతుడు యితనితోటి యిష్టం కావలెనని గాని విరోధం కూడదని రాజుగారితోటి యిష్టం చేస్తున్నాడు. తదనంతరం ఆ మాటలు నారాయణదేవు విని నవాబు మీద అయిష్టపడుతున్నాడు. యీచొప్పున వుండగా—తదనంతరం—పూసపాటి పెదవిజయరామరాజుగారున్ను నవ్వాబున్ను చాలా స్నేహితులై వున్నంతల్లో వకనాటిసమయమందున నవాబు రాజు మర్మం తెలియకోరి ప్రసంగ వశాత్తుగా కొన్నిమాటలు సంభాషించి మీగు యింత రాణువను వుంచుకున్నారుగదా యీరాణువకు యేలాగున గడుస్తుంది మీకువున్న వసతులు విచారిస్తే మించితే దివాణానకు యిచ్చేది లక్షా లొంభై వేల రూపాయీలు జమాబందీగదా. యింకా విస్తరించి మిగిలితే రెండులక్షలరూపాయీలు మిగిలిని. పావం—మీ శౌర్యవంతాలు మీయొక్క ఫంజు మంది జమీయొక్క ఖర్చులు విచారించగా నాకు యేమిగడుస్తుంది అని తోచలేదు- అని కపటాంతరంగుడై

అకృత్యం తలుపుకొని మంచిమాటలు చాత అడిగినట్టుగా అడిగితే పీడికపటం తెలియక స్నేహమే ప్రధానంగా యెంచివున్న యీ వైరిభాగుల రాజు శలవుయిచ్చిన మాటలు నవాబువారికి యిచ్చే పేషుకషుమాత్రం లక్షాతొంభై వేలరూపాయీలు మేముపద హారులక్షల రూపాయీలకు పీలుచేసుకు న్నాము. లేకపోతే యీరాణువఖర్చులు యెల్లాగడుస్తవి. అని శలవుయిచ్చేటప్పటి యతని మంత్రి అయిన బుర్రా బుచ్చన్న! నవాబువార్కి మీకు యింతయిష్టంగా వున్నా యీలాగంటి మర్మపుమాటలు బోధపర్చినంతల్లో ఆద్యంతాల్లు విరోధవస్తుంది అని చెప్పవద్దని మనవిచేశే తక్కు రాజుగార్కి కోపంవచ్చి తనమాటక్కు అడ్డుమాటలు చెప్పినాడని బుచ్చన్నగారిని తీస్కుని! పోయి చీపురివల్లికోటలో ఖయిదుచేయించినాడు. మరినాల్గునెలలకు రాజుగార్కి నవాబుకు యిష్టంతప్పి మీరు పదహారులక్షలరూపాయీలు తాలూకాలలో జమాబందీచేస్కుని సర్కారుకు లక్షాతొంభై వేలరూపాయీలు యివ్వడం యేటువంటి సబబుగన్కు, నాలుగులక్షలరూపాయీలు కట్నం యిస్తేనేగాని కూడదని చాలా ఘట్టిపట్టు పట్టేనంతల్లో రాజుగారు శలవుయిచ్చినమాటలు—

మాకు అర్థంకాం రావడంలేదు అని శలవుయిచ్చినారు యిందునగురించి పృథ్వయులకు సరిపడకపోయెగన్కు యీపను యెంకసిపెట్టె నారాయణదేవు ఖయిదులోవున్న బుర్రా బుచ్చన్నగారికి వర్తమానం పంపించినారు యేమంటే—

నవాబుమందర యిష్టంచేశి పెన్కు యిండ్లుతీశి పారవేశేవాడు గన్కు యేలాగైనా వీణ్ని కొట్టి పారవెయ్యడం వుత్తము కార్యం అని బుచ్చన్నగారికి వర్తమానం పంపించిబోధ చేయించేవారు. అందుకు తిరిగీ బుచ్చన్నగారు మేము ఖయిదులోవున్నప్పుడు రాజుగారు మామాటలు వినపోతారా మాతోటి యీమాటలుయెందుకు శలవుయిస్తారు రాజుగార్కి వుత్తరం వ్రాయిస్తే అన్నిసంగతులు తెలుస్తుంది. ఆ చొప్పున వుత్తరం వ్రాయించుమని ఖబరు పంపించినారు గన్కు యీపల్కులకు నారాయణదేవువారు తిరుగా బుచ్చన్నగార్కి ఖబరుపంపించిన వయినం—మీకు మేము ఖబరుపంపించడం మంచిదికాదు రాజుగారికి మేము ఖబరుపంపించి వేగం యుద్ధానికి మద్దతు రమ్మనుమని వ్రాయిస్తారు. వారు శలవుకాగానే మేము నడుములు కట్టుకుని రావలశి వుంటుంది, రాజుగారే గన్కు మాకు వర్తమానంపంపిస్తే వారు భత్యఖర్చులు ముజరాయిస్తారు. యీ మద్దతున మాకు భత్యఖర్చుల్లు యిబ్బ్రాటకంగా వున్నది గన్కు యింతగా మీతోటి అగపడకోవడ మయినది. అని బోధచేస్తూ వచ్చినారు. మరికొన్ని దినములుక్కు విజయరామ రాజుగారు బుచ్చ

న్నగారికి ఖబురువదలించి పిలుపించి మునుపు మీరు చెప్పినమాటల్లా అనంగీకారుడనై యిందున ఖయిదుచేయించినాను. యీపాపం నాకుకొట్టింది, నీవు యెంత అయినా నిర్యోగివి. ఆలోచనకు బృహస్పతివి. మీరు చెప్పినట్టు వినుకుంటాను. చెప్పమని శెలవుయిచ్చిరి గన్క మంచిదని యింటికిపోయి ఆలోచనచేస్తుని చెపుతానని శావేగం నవాబువారు విజయనగరం కోటవదలి వడ్డాదికోటలో రాజుగారి శ్రీలు యావత్తు వుండగా ఆకోట ముట్టడి చేశినారని ఖబరువచ్చేవరకు తిరుగా బుచ్చన్నగారిని పిలిపించి యేమి ఆలోచన అని అడిగితె యీమద్దతున నారాయణదేవువారిని పిలిపించక అనుకూలంకాదు. ఆనందరాజుగారిని పంపించవలెనని చెప్పేవరకు మంచిది అని ఆనందరాజును పంపించినారు. నవాబు నారాయణదేవు తనకు మద్దతు వస్తాడని విచారించి వర్తమానం పంపించేవరకు నేను వచ్చేదిలేదని తెలియచెప్పి పూసపాటి ఆనందరాజుగారు తంమ్ము వహాయిం రమ్మనిరి గన్క రాణువను యావత్తు తయారుచేస్తుని అతివేగంగా వచ్చినాడు. యిక్కడ వీరుచేసిన కుయుక్తి యేమంటం-

యిప్పుడు మనశ్రీలు యావత్తు మ్లేచ్ఛుల ముట్టడికి లోపుగా వున్నారు. వాండ్లతో యుద్ధంచేశినంతల్లో జయాపజయాలు యీశ్వరాధీనం! వాడు మునుపే శ్రీలచాతను పేడకట్టలు మోయిస్తానని ప్రతిజ్ఞలు పలుకుతూవున్నాడు. కనంత తప్పినా అనుమార్గుడు అలాగున చేసును. అదిగన్క యీసమయమందు నీచమని విచారించక కశ్మికోటలో నవాబువారి చిన్నవాండ్లు యావత్తు వున్నారు. మనం పోయి వారిమీద ముట్టడివేస్తే వడ్డాదినుంచి లేచిపోతారు. అక్కడ్డి బగుల్లు బదులు అవుతుంది. అదిగన్క ప్రాణంపోతే పీడపాయను గాని మానంపోతే ప్రయాస అనుకొని కశ్మికోటమీద నారాయణదేవువారున్ను వడ్డాదిమీద్ది విజయరామరాజుగారున్ను పోయి దిగెవల్సు తరకలు ఆలోచనలు చేస్తుని రాజుగారి చిన్నబాట్టెలుమీద మనంపోయి దిగితె మన చిన్నబాట్టెలమీద వారువచ్చి దిగినారు— మేము క్షుద్రవుపనులు విచారించినాము గన్క వారు అలాగే విచారించినారు. యిది వుచితంకాదని ముట్టడివదలి తక చిన్నబాట్టెలమీద వున్న ముట్టడివదలుము బతిమాలుకునేవరకు ముట్టడిమాగ్రం దలినారాయణదేవున్ను విజయరామరా[జు]గారున్ను కలిశి నవాబును కోడావరదటించి సామానుయావత్తు విజయరామరాజు దోచుకుని నారాయణదేవువారి బహుమానంచేశి పంపించినారు. మరికొన్నిదినములకు పూసపాటివారు అన్నమాటలు—మీరు ఇదట కొన్ని కరారుల చేస్తుని దేశాన్నిగురించి కొంతవయిక నిర్ణయంచేసుకున్నారు గధా ఆపోవ్వ యిప్పుడు పయికం యింమ్మనుమని వర్త[?]మానం పంపించేవరకు వాడు తిరుగ ఖబురుపంపించినాడు—

